ఓమ్.

# సమాలోచన

జగతిలో మానవజన్మము నొందుట దుర్లభము. అట్లు లభించిన మానవజన్మమును సద్వ్యయ గాములమై, సుందర జీవాసులమై సర్వమంగళకరముగా నొనరించుకొనుటయే మనుజుల పరమ లక్ష్యము. ఈలక్ష్యము పొందుటకు జ్ఞానము గావలయును. జ్ఞానసంపద నార్జించుటకు బ్రహ్మచర్య పవిత్రవ్రత దీక్ష జీవగఱ్ఱ. ఇట్టి బ్రహ్మచర్య వ్రతమాచరించుటకు సమగ్రముగు నియమములు గల గ్రంథములు తెలుగులో నెక్కువ లేవు. ఏవో యున్న గ్రంథములు పెద్దవియై చదువరులకు దలబరువుగా నుండుట వలన నవియంత లాభకారిగా లేక పోయినవి. ఈలోపము గ్రహించి "బ్రహ్మచర్య" మను ఈచిన్న కృతిని శ్రీశుద్ధ చైతన్య స్వాములవారు హిందీనుండి యల్పమార్పులతో తెనిగించి తెలుగు వారిమన్ననకుఁ బాత్రులైరి. పొత్తము చిన్నది ప్రతిభలో పెద్దది.

నేను 1945 మే నెలలో బెంగుళూరునకు వెళ్లియుంటిని. అచ్చట వైశ్యకులచింతామణి సనాతనాచారపరాయణులు నగు శ్రీకొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారిని దర్శించు భాగ్యము లభించినది. అప్పట్లో శ్రీసుబ్బయ్యశ్రేష్ఠిగా రస్వస్థులుగా నుండిరి. అట్లుండియు, శ్రీ శ్రేష్ఠిగారు తన నిత్యకర్మ కలాపముల నుం

తేయు విడనాడక సక్రమముగా నిర్వర్తించుచుండిరి. శ్రీవారి యాస్తికతాబుద్ధి ప్రశంసార్హమైనది. ప్రతిదినము వేదాంత శ్రవణమువిడవలేదు పండిత శ్రీ M. V. రాఘవేంద్రాచార్యస్వామిగారు తాముగ రచించిన "శ్రీలఘుయోగవాసిష్ఠసారసంగ్రహ" మును నేను చదువుచుండగా శ్రీస్వామిగారు శ్రేష్ఠిగారికందులి యర్థమును విశదీకరించుచుండిరి. శ్రీశ్రేష్ఠిగారు వ్యాధిగ్రస్తులయ్యు తత్త్వవిచారణయందున్నట్టి యానంద మనుభవించుచుండిరనుటలో యతిశయోక్తి వా[illegible]. ఆగ్రంథశ్రవణము పూసమాప్తి యగుటకు నెలదినములైనవి. ఆగ్రంథ పఠనపరిసమాప్తి యనంతరము శ్రీశ్రేష్ఠిగారు పాత్రములో విషయమంతయు తుచ తప్పక నుచ్చరించిరి. దీనివలన శ్రీవారు మననము గావించుటలో కుశలబుద్ధి గలవారనుట విస్పష్టమైనది కదా! కొం[illegible] మాస్టరుగారు ప్రకటించిన "బ్రహ్మచర్య" మనుపాత్రమును శ్రీశ్రేష్ఠిగారికి నేనిది వివరించుచుంటిని శ్రీశ్రేష్ఠిగారికి చిరకాలము నుండియు బ్రహ్మచర్య వ్రతైకముప్రచారమునకనువగు పాత్రముచు ప్రచురింపవలయునని తలంపులముండుటయు, నాలోక మీకృతిసంతానము పరిహరించినదనియు ముచ్చటించిరి. దీనిముద్రణ కర్చవ్యయభారము వహింతునని నాతో విన్నవించిరి. ఈకార్యము చిరకాలములో కాక పుస్తకముగా గావించునని యాశించితిమి. కాని దైవప్రాతికూల్యమువలన 3-10 45 న శ్రీశ్రేష్ఠిగారు పంచత్వమందిరని పిడుగువంటి వార్తాపత్రికముఖంబున గాంచి ప్రేమతో సానుభూతి వెల్లడించితిమి కాని శ్రీశ్రేష్ఠిగారి దృఢసంకల్పప్రభావము మోఘమైనది శ్రీశ్రేష్ఠి

గారి భావము తత్పుత్రరత్నమగు శ్రీ కొ॥ సుబ్బరావు B. A (Hons.) గారి మూలమున రూపకల్పనమును బొందినది "యథా పితా తథా పుత్రః" యనెడి ప్రాచీనోక్తి సహస్రధా. వృథా కాదుగదా! సజీవమగు నార్య వాఙ్మయ శ్రీకి నమోవాకములు.

ఈ "బ్రహ్మచర్య" పొత్తమున రసవీర్యగుణ లక్షణ ప్రభావము సోపపత్తికముగా నిర్వచింపఁ బడినది. ఈకృతి బ్రహ్మచర్య వ్రతదీక్షా పరాయణులకు సప్రణయోపాయనము. దీనివలన లోకము బాగుపడినచో గ్రంథకర్త గారికదియే వజ్రమణిమయమకుట ధారణమనుటలో యతిశయోక్తి కాదుకదా నిత్యపూజార్హమగు నిర్గుణతత్త్వప్రథ యిక్కార్య నిర్వహణమునకు నియంత్రయై జగతిని, నిత్యకల్యాణ కాంతుల నిండార్లగా ప్రవహింపఁ జేయుగాత!

ఈ పొత్తమును వెలుఁగునకుఁ దెచ్చిన కీ॥ శే॥ కొ॥ సుబ్బయ్యశ్రేష్ఠిగారి కుటుంబమును పరమేశ్వరుఁడు కృపతో వీక్షించి సంరక్షించుగాత.

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీ వేంకటేశ్వర సంస్కృత
కలాశాల తిరుపతి.
చిత్తూరుజిల్లా
26-12-1945

ఇట్లు
సాధుజన విధేయుడు
సూరా నారాయణశాస్త్రి
న్యాయశిరోమణి విద్యార్థి.

# బ్రహ్మచర్యము.



"బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత" (అథర్వ ణము) బ్రహ్మచర్యమనెడి తపస్సుచేతనే దేవతలు మృత్యు వును జయించిరి.

ఏ దేశమునఁ బ్రతియొక్క బాలునకును బ్రహ్మచర్య మని వార్యముగా నుండెనో, ఏదేశపు జాతికి సౌన్నత్యమునకుఁ గూర్చి నియమితములైన నాలుగాశ్రమములలో బ్రహ్మచర్యాశ్రమ ము ప్రధానమై యుండెనో, అయ్యయో! అట్టి యీ భారత దేశమున నట్టి బ్రహ్మచారులకు సంబంధించిన యీ భారత జాతియందు బ్రహ్మచర్యము శూన్యమై పోయెనే! ఏదేశపు బిడ్డలు సైతము సింహములతో బాటు ఆడుకొనుచుండిరో, ఏదేశపు శిశువుల పాదఘట్టనము చేతఁ బర్వతశిలలును చూర్ణ మగుచుండెడివో! అట్టి వీర్యమే ప్రధానముగాఁ గల యీ భార తదేశము నేఁడు నిర్వీర్యము యైపోయెనే! బలహీనమై పోయెనే! అకటా! ఎంతటిదౌర్భాగ్యము దాపరించెను! నేఁడీ దేశము న లక్షలకొలది బాలురు బ్రహ్మచర్యవ్రతము నుండి భ్రష్టులై యౌవనావస్థరాకముందే పరిపక్వముగాం వీర్యమును నష్ట పఱచుకొని బుద్ధిశక్తి, బలము, తేజస్సు, ఉత్సాహ

షును గోల్పోయియున్నారు. లక్షలకొలది యువకులు పలు రకముల దుర్వ్యాధులతోఁ బీడింపఁబడుచున్నారు. లక్షలకొలఁది యువకులు దిక్కు లేని తల్లిదండ్రులను, యువకులగు స్త్రీలను దుఃఖ సముద్రమున ముంచివైచి తాము మృత్యువువా తఁబడుచున్నారు. సంయమము, నియమము సాధనసంపత్తి, సుఖము మనుష్యత్వమును తీఁని నష్టము పాలై పోవుచున్నదిగదా! ఇట్టి దుర్దశాగ్రస్తమగు నీ దేశముయొక్క రక్షణము బ్రహ్మచర్యవ్రతముయొక్క పునఃప్రతిష్ఠచేతనే కాఁగలదు. ఇట్టియీ విషయమును గూర్చి సద్గ్రంథములను సత్పురుషులను స్వానుభవములను నాధారముగఁ గైకొని ఈచిన్ని పుస్తకమును వ్రాయఁదలంచితి.

## మనజీవితలక్ష్యము దానికి సాధనములు.

పూర్వులగు మన ఋషులును మునులును, సుఖాన్వేషకులయి ప్రయత్నముఁ జేసిచేసి మిగులగొప్పయనుభవముతో "శాశ్వతసుఖప్రాప్తి కేవలము ఒక్క పరమాత్మ జ్ఞానమునందే కలదు" అనెడి సిద్ధాంతమును ధ్రువపఱచిరి. ఇదియే మానవజీవితమునకుఁ జివరిలక్ష్యము. దీనికిఁ బైనిక ర్తవ్యమింకొక టేదియు లేదని యర్థము. ఎంతవఱకైతే మనుష్యుఁడు భిన్నభిన్నముగానుండు జగత్తునందంతటను ఏకమై సర్వవ్యాపకమైయున్న పరమాత్మను దెలిసికొనసేరఁడో, అంతవఱకు సంపూర్ణముగఁ దనయొక్క దుఃఖనివృత్తిగానేరదు. ఇందువలనమనుష్యునకు గర్తవ్యమేమి? యన.

అద్వితీయమై - నిత్యమై - సుస్థిరమై - శుద్ధమై - యున్నయట్టి సచ్చిదా
నందమును జేరుటయే జీవులకే మనకు భగవదనుగ్రహము
ద్వారా దేవతలకును దుర్లభమైన యీ మానవదేహము సంప్రా
ప్తించినది, కాని యది సులభముగా సంప్రాప్తమగుట యెట్లు? దీని
నిమిత్తమయ్యే మన పూర్వులు నాలుగాశ్రమములు విధించిరి.
మఱియు నా విధానమున సంసారక్షేత్రమునందియు నెవ్విధమై
న బాధయు లేకయే మనుష్యుఁడు క్రమముగా గమ్యస్థానమునకు
దార్ఢ్యతోను ప్రయాణము చేయఁగలుగునట్లు ఏర్పాట్లు
గూడఁ జేసిరి. ఆరంభమునుండియు దేనిచేతఁ బ్రతియొక్క ఆర్య
బాలకుని హృదయమునందును బ్రహ్మప్రాప్తి యనెడి లక్ష్యము
స్థిరముగానుండిపోయి సంయమము, నియమపూర్వకముగా
నుండి యాతఁడు దానికి నుపయోగపడు నన్నివిధముల శిక్ష
తోఁ "దక్షుఁడు" గాఁగలఁడో, అట్టికట్టుబాటునుగూడఁ జేసిరి.
ఇట్టికట్టుబాట్లుగల యాశ్రమములలో మొదటిది బ్రహ్మచర్యా
శ్రమము. ఎవ్వఁడీ యాశ్రమమునకు సంబంధించిన కర్తవ్యకార్య
మునంతయుఁ బూర్ణమొనర్చి తేజోవంతుఁడైన నా యువకుఁడు
బ్రహ్మచర్యముయొక్క కఠినపరీక్షయందు తీర్ణుఁడు గాఁగలుగు
నో అప్పుడు వానికి మిగుల దార్ఢ్యపూర్ణమైన రెండవది
యగు గృహస్థాశ్రమమునందు బ్రవేశించుటకధికా
రము గలుగుచున్నది. మఱియు నిటఁగూడ నతఁడు
బ్రహ్మప్రాప్తి యనెడి లక్ష్యమును నిరంతరము దృష్టియం

కుంచుకొని విశాలహృదయముతోఁ దనకు ధర్మబద్ధముగా నుండు శ్రౌతియుక్త కార్యమును నెఱ బ్రహ్మార్పితమైనయే భగవదర్పణబుద్ధితోఁగూడ నిర్వర్తింపఁ గలిగియుండును. ఏ సమయమున నాతఁడు గృహస్థుఁడైన తనకుఁ గర్తవ్యములైన సమస్తకార్యముల నిర్వర్తించినవాఁడాయెనో అప్పుడు వానికి మూఁడవదియైన వానప్రస్థాశ్రమమునఁ బ్రవేశింపవలసియుండును. మఱియు నట్టిచోఁ జక్కఁగా త్యాగమొప్పఁ బరిపక్వావస్థకు వచ్చినపిదప నాల్గవదగు సన్యాసాశ్రమదీక్షను స్వీకరించి యట్టి మనుజుఁడు దేహాభిమానముతో సహా బాహ్యవస్తువులకు నైనను సంపూర్ణముగఁ బరిత్యజించి పరమాత్మయందు లీనముగాఁగలఁడు. నూఱు సంవత్సరముల ఆయుఃపరిమాణము ననుసరించి నియమమిది. అనఁగా మొదట 25 సంవత్సరములవఱకు మనుష్యుఁడు బ్రహ్మచర్యవ్రతమును బరిపాలించవలెను. 25 నుండి 50 సంవత్సరముల వఱకు గృహస్థాశ్రమమున నుండవలెను. 50 వ సంవత్సరము పూర్తియైనతోడనే భార్యాపుత్రులతోను అరణ్యమున నివసించుచు వానప్రస్థాశ్రమమును సేవింపవలెను 75 వ సంవత్సరము పూర్తియగువఱకు నిట్లనుష్ఠించి పిదప జీవితము సమాప్తినొందువఱకును సన్యాసాశ్రమమున నుండవలెను ఈ విధానము నూఱు సంవత్సరములు జీవించు కాలములోఁగాని యీకాలమున నిది యెట్లు సంభవమగునని కొందఱు దలంతురు, కాని యీ వి

సయము వారు బొందుచున్నారు. ఏమన శాస్త్రపద్ధతినను సరించి మనుష్యుడు 25 సంవత్సరముల వఱకు అఖండ బ్రహ్మచర్యవ్రతమును సలిపినచో నీకాలమునసైతము నూఱు సంవత్సరములు జీవించుట యొక యాశ్చర్యము గాదు. ఆయుఃక్షీణమగుటకుఁ గారణము బ్రహ్మచర్యము నశించుటయే యని గాఢముగ నమ్ముము. ఏకాలమున నీ దేశమునందు బ్రహ్మచర్యప్రచారము బాగుగనుండెనో అప్పుడీ దేశమున నిన్ని వ్యాధులుండెడివి గావు. మఱియు యౌవనావస్థలో నెవఁడును మరణించుటయే లేకుండెను, కాని నేఁటికాల ఆనారోగ్యస్థితికి సర్వథా విపరీతముగనున్నది. మనము జీవనమునకు మూలమైన బ్రహ్మచర్యమును విడిచివైచితిమి. ఇందువలననే మనకీ దురవస్థ దాపరించినదాయెను. ఈవిషయమును బాగుగా గుర్తించుఁడు. ఎంతవఱకు మన భారతదేశమున బ్రహ్మచర్యముయొక్క పునఃప్రతిష్ఠ గానేరదో, అంతవఱకు మనము పైకిలేచుట మిగులదుర్ఘటము. కట్టఁబడని పునాదిపై భవనము లేవనేరదు గదా! ఒకవేళ లేచినను అయ్యది యించుక దెబ్బదగిలినను క్రిందఁ గూలిపోవునంత బలహీనముగానే యుండును. ఇట్లే బ్రహ్మచర్యమనునది లేక జీవనము నిలువఁబడఁజాలదు. ఒకవేళ నెచ్చటనైన నున్నను అయ్యది దుఃఖపూర్ణముగానే యుండును సుమీ! అదియు స్వల్పకాలము మాత్రమే, కనుక నేఁడీ మన దుర్దశ,దియే హేతువని గ్రహించుఁడు.

## వీర్యరక్షణమే బ్రహ్మచర్యము.

శరీరమున నోజస్సనెడి ధాతువెంతయో జీవనమునకుఁ గారణము. మాధవుఁడు వాగ్భటాచార్యులు నుడివెను:-

శ్లో॥ ఓజశ్చ తేజో ధాతూనాం సుక్రాన్తానాం పరంస్మృతమ్।
హృదయస్థమపి వ్యాపి దేహస్థితినిబన్ధనమ్॥
యస్య ప్రవృద్ధే దేహస్య తుష్టిపుష్టిబలోదయాః।
యన్నాశే నియతో నాశో యస్మిన్ తిష్ఠతి జీవనమ్।
నిష్పాద్యన్తే యతో భావా వివిధా దేహసంశ్రయాః।
ఉత్సాహప్రతిభాధైర్య లావణ్యసుకుమారతాః॥

అనఁగా రసమనెడి ధాతువునుండి వీర్యమనెడి ధాతువు వఱకును నుండు నేడు ధాతువులకును సంబంధించిన యే తేజస్సైతే కలదో దానినే ఓజస్సందురు. ఓజస్సు ముఖ్యముగా హృదయమందుండును. ఐనను దాని ప్రకాశము దేహమునందంతటను వ్యాపించియుండును. ఓజస్సు వృద్ధిఁబొందుటచేతనే సంతుష్టి, పుష్టి, బలములయొక్క ఉత్పత్తియు నేర్పడగలదు. ఓజస్సు నశించుటచేతనే మృత్యువు సంభవించును. ఈయోజస్సనెడి పదార్థమే జీవనమునకు నాధారము. దీనిచేతనే ఉత్సాహము, ప్రతిభ, ధైర్యము, లావణ్యము సౌకుమార్యమును సంప్రాప్తించును.

ఈ యోజస్సెటనుండి సంప్రాప్తమగుచున్నదో సుశ్రుతమహర్షి వచించియున్నాడు:- "రసాదీనాం శుక్రాన్తానాం

ధాతూనాం యత్పరం తేజస్తత్ఖల్వోజస్తదేవ బలమితి'' రస
మునుండి వీర్యమువరకుఁగల సప్తధాతువులయొక్క ఉత్తమ
తేజోభాగమే ఓజస్సనఁబడును. ఇదియే బలము, అని ఈయో
జస్సెక్కడుండును? మఱియు నెటనుండును? అనిన శార్ఙ్గధరుఁడి
ట్లు వర్ణించుచున్నాడు:—

శ్లో॥ ఓజస్సర్వశరీరస్థం స్నిగ్ధం శీతం స్థిరం సితమ్।
సోమాత్మకం శరీరస్య బలపుష్టికరం మతమ్॥

ఓజస్సు దేహమందంతటను బ్రకాశించుచుండును. ఇ
ద్యాది స్నిగ్ధము, శీతలము, స్థిరము, శుభ్రము పరాక్రమరూ
పము నై శరీరమునకు బలమును పుష్టిని నొసంగుచుఁ బ్రకా
శించుచుండును, అని ఇత్యాది ప్రమాణములను బట్టి యీ
యోజస్సు వీర్యమునుండియే ఉత్పన్నమగుచున్నదని రూఢి
యయ్యెను, కావున వీర్యమే ప్రాణధారణకుఁ బ్రధానహేతు
వు, ఇదియే జీవనమునకు ముఖ్యాధారము. అట్లయిన నిప్పుడు
వీర్యమనఁగా నేమో? అయ్యది యెట్లుత్పన్నమగునో? తెలిసి
కొనవలసియున్నది. ఆయుర్వేదమునుబట్టి చూచిన శరీరమున
సప్తధాతువులున్నట్లు విశదమగును. ఈ పదార్థములే మను
ష్య జీవనమును ధారణసేయుచున్నవి; కావుననే వీనికి 'ధా
తువు' లని పేరు గలిగెను.

శ్లో॥ ఏతే సప్తస్వయం స్థిత్వా దేహం దధతి యన్నృణామ్।
రసాసృఙ్మాంసమేదోఽస్థి మజ్జాశుక్రాణి ధాతవః॥

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి నరము లు, మజ్జ, వీర్యము నివియేడు పదార్థములను గూడి మనుష్యుని యొక్క దేహమును నిలఁబెట్టుచున్నవి. ఇందువలననే యివి ధాతువులనఁబడినవి. మనుష్యుఁడు దేనిని భుజించునో దేనిని దేహముపై నుంచుకొనునో, దేని నాఘ్రాణించునో అవి యెల్ల శరీరములోనికిఁబోయి యెట్లుండుట నొక విచిత్రమై రసముగా నేర్పడును. పిదప దీనినుండియే క్రమముగా నితర ధాతువులుగూడ నుత్పత్తి యగుచుండును. "రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే। మేదసోఽస్థి తతో మజ్జా మజ్జాయాః శుక్రసంభవః" అని యిట్లు సుశ్రుతమునఁ గలదు. అనఁగా భుజించిన పదార్థములు మొదట రసముగా నగును. దానినుండి రక్తము, రక్తమునుండి మాంసము, మాంసము నుండి మేదస్సు, మేదస్సునుండి అస్థి-నరములు, నరములనుండి మజ్జ, మజ్జయను దానినుండి యీ యన్నింటి యొక్కయు సారముగ నేడవదియైన వీర్యమనెడి పదార్థము తయారగుచున్నది. ఈవీర్యమే ఓజస్సనెడి యుత్తమ తేజస్సుగా బరిణమించి దేహమునందంతటను మెఱయుచుండును. ఇయ్యది మాఱదు. ఒక ధాతువు పక్వమై మఱొక ధాతువుగా మాఱుటకు నైదుదినములు పట్టును. సారమైన పదార్థము దేహములో నిలఁబడిపోవును. ఇఁక పక్వమొనర్చుటలో మిగిలియుండెడి వస్తువు (పిప్పి) మలమూత్రములుగను, చెమటగను, ముఱికిగను, గడ్డము మీ

నము మున్నగు వానియొక్క వెంట్రుకలుగను మాఱి బయటికి వెడలిపోవుచుండును. వీర్యముగాఁగానే ఆ పక్వమగుటయనెడి పనియాగిపోవును. ఇఁక నా సారమైన పదార్థము ఓజస్సుయొక్క రూపమున శరీరమునందు నిలిచిపోవును. ఇవ్విధమున రసమనెడిదానినుండి వీర్యమువఱకుఁ బ్రతిధాతువునకును ఐదైదు దినములచొప్పున ఆఱు ధాతువులును పక్వమగుటకు ముప్పది దినములు పట్టును. అనఁగా నేఁడు భుజించిన అన్నము మున్నగు పదార్థము ముప్పదియవ దినమున వీర్యముగాఁ దయారవును. బాగుగా నలుబది శేర్లు (ధాన్యము) భుజించుటచేత నొక శేరు (కొలత) రక్తమగును. పిదప నా ఒక్క శేరు రక్తమునుండియు రెండు తులముల వీర్యమేర్పడును. ప్రతిదినము బాగుగా ఒక్క శేరు ధాన్యము (రెండు లేక మూఁడు పూటలకు) భుజించువాఁడైనను ఒక్క మాసమునకు ముప్పది శేర్లు మాత్రమే భుజించువాఁడగును. ఈ లెక్క చొప్పున ముప్పది శేర్ల యన్నముచేతను ఒక నెలకు 1½ తులము వీర్యము తయారగును. ఇది ఒక్క మాసము రోజులు కష్టపడి సంపాదించిన సంపాదన. ఒక్కమారు స్త్రీ సంసర్గముచేత 1½ తులమునకు తగ్గకుండ వీర్యము వ్యయమైపోవును. ఇఁక నిప్పుడు విచారణ సలుపుఁడు. ఏ వీర్యమును నెలరోజులు కష్టపడి సంపాదింతుమో, అయ్యది ఒక్క క్షణములో నష్టమైపోవుచున్నది ఇఁక దానినెవ్వఁడు పర్వడియేర్పడక పూర్వమే నిత్యము నిల్ల

నష్టపఱుపఁగోరుచున్నాఁడో అతఁడికి దివాలా దెబ్బయగుటకు నేమైన సంశయముండెనా? శాస్త్రమునందిట్లు చెప్పఁబడియున్నది:—

శ్లో॥ శుక్రం సౌమ్యం సితం స్నిగ్ధం బలపుష్టికరం స్మృతమ్।
గర్భబీజం వపుస్సారో జీవనాశ్రయ ఉత్తమః।

వీర్యము శాంతస్వరూపము, పరిశుభ్రము, స్నిగ్ధమునై బలమును, పుష్టిని గలుగఁజేయుచున్నది. ఇయ్యది సంతానమునకు బీజము. శరీరముయొక్క సారము. జీవనమునకు ముఖ్యాధారము.

శ్లో॥ యథాపయసి సర్పిస్తు గుడశ్చేక్షౌ రసో యథా।
ఏవం హి సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినామ్॥

పాలలో నేయివలెను, చెఱకుయందు (బెల్లముచేయు) రసమువలెను జీవులయొక్క దేహమునందంతటను వీర్యము వ్యాపించియుండును. కావున పాలనుండి వెన్నను దీయుటకుఁ బెరుఁగునట్లు మథింపవలసియుండునో, బెల్లమును తయారుచేయుటకెట్లు చెఱకును గానుగలో నైచి మథింపవలసియుండునో అట్లె ఒక వీర్యపుబిందువును బయల్వెడలించుటకు దేహమునంతటిని మథించుట యేర్పడుచున్నది. వెన్న బయల్వెడలిన పిదప పాలు (పెరుఁగు) ఎట్లు సారహీనమై బలములేనిదగుచున్నదో, చెఱకు రసమును దీసినపిదప చెఱకెట్లు-పిప్పి పిప్పి యయిపోవుచున్నదో ఇట్లే వీర్యమును బయల్వెడలించుట వ్య

యమురోర్చు) చేత శరీరముకూడ నిస్సారమై, తేజోవిహీన మై బోలిపోయి, వాడి, చెడి పిప్పిపిప్పి యగుచున్నది. దేహములోని నరములన్నియు పట్లుదప్పిన వగుచున్నవి ప్రతియొక్క అవయవమునందును దౌర్బల్యము దాపరించుచున్నది. వీర్యము పతనమైన (నశించిన) వెంటనే మనుష్యుడు నశించినట్లే. వీర్యమును నిలుపుకొనుటచేత జీవనమును గూడ నిలుపుకొనుట యగుచున్నది. కావున సోదరా మేల్కొనుము. "వీర్యధారణం బ్రహ్మచర్యమ్" అనగా వీర్యరక్షణసేయుటయే బ్రహ్మచర్యమగును. శివసంహితయందెట్లు చెప్పబడియున్నదో చూడుడు; —

శ్లో॥ మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్।
తస్మాదతిప్రయత్నేన కురుతే బిందుధారణమ్॥ అని

అనగా వీర్యబిందువు పతనమగుటయే మృత్యువు. అట్టి యీబిందువును దేహమున నిలిపికొనుటయే ప్రాణము నిలుపికొనుటయగును. కావున అత్యంత ప్రయత్నముతో వీర్యరక్షణ సేసికొనవలయును. భగవానుడగు శివుడు ఇట్టి దివ్యమైన బిందువును ధారణసేయుట యనెడి బ్రహ్మచర్యము యొక్క ప్రతాపముచేతనే హాలాహలమనెడి విషమును గ్రోలియు స్వస్థతగానే యుండునంతటి ప్రభావము గలవాడాయెను. ఈమాహాత్మ్యమంతయుఁ గాముని జయించుటనే స్పష్టపఱచుచున్నది. భగవానుడగు శివుడే చెప్పిన మఱొక వాక్యము —

శ్లో॥ సిద్ధే బిన్దౌ మహారత్నే కిం నసిధ్యతి భూతలే।
యస్యప్రభావాన్మహిమా మమాప్యేతాదృశో౽భవత్॥

దేని ప్రభావముచేత నేనిట్టి మహిమగలవాఁడనై యుంటినో, అట్టివీర్యబిందువనెడి మహారత్నమును సంపాదింపఁగా భూత[illegible]సాధ్యముగానిదెయ్యది? భక్తరాజగు-హనుమంతుని యొక్కయు, పితామహుఁడైన-భీష్మునియొక్కయు బ్రహ్మచర్య ప్రభావము జగత్ప్రసిద్ధమేకదా! వాస్తవము విచారించిన బ్రహ్మచర్యమే సకల పురుషార్థములకును మూలమనెడి విషయము సర్వథా యథార్థము. దీనిద్వారా మనుష్యుఁ డెల్లప్పుడును రోగరహితుఁడై సుఖముగానుండును. దీనిచేతనే అకాల వార్ధక్యము అకాలమరణము, దీనిచేతనే హర్షముగలవారును పుష్టిగలవారు–బలిష్ఠులునగు ధర్మపరాయణులైన పుత్రులుత్పన్నముగాఁగలరు. దీనిచేతనే మనుష్యుఁడు దీర్ఘాయుష్మంతుఁడు విద్వాంసుఁడు, సత్యవాది, జితేంద్రియుఁడు, ధర్మిష్ఠుఁడుగా నుండఁగలఁడు, దీనిచేతనే భగవద్భక్తి, ధ్యానముయొక్క యోగ్యతలభించును. దీనిచేతనే సాధనలయందుఁ బట్టుదల, సిద్ధియుఁ గలుగును. దీనిచేతనే మనుష్యుఁడు నిర్భయుఁడు, శాంతుఁడునయి లోకసేవఁ జేయఁగలవాఁడగును, దీనిబలముచేతనే తుట్టతుదకు పరమాత్మునిఁ గూడఁ జేరఁగలుగుచున్నాఁడు. ఇదియే సమస్తసాధనలలో మొదటిది, అత్యుత్తమమునై యున్నది. ప్రజాపతియగు బ్రహ్మదేవుఁడు దేవేంద్రునిద్వారా

దీర్ఘకాలము వఱకు బ్రహ్మచర్యమునుఁ జయించిన పిదపనే వానిని బ్రహ్మవిద్యాధికారిఁగాఁ దలంచెను. భగవానుఁడుగూడ గీతలలోనెట్లు చెప్పియున్నాఁడో చూడుఁడు. "యదిచ్ఛన్తో బ్రహ్మచర్యాం చరన్తి" దేనిని (పరబ్రహ్మమును)గోరి నైష్ఠికబ్రహ్మచారులు బ్రహ్మచర్యము ననుష్ఠించుచుందురో దానిని, నీకుఁదెలియఁజేసెదను; అని కావున మనకు భగవంతుని శాశ్వతానందమును బొందనిచ్ఛయున్నచో మనస్సును నిగ్రహించి బ్రహ్మచర్యము ననుష్ఠింపవలయును. మన సంతతినిగూడ ననుష్ఠింపఁజేయవలెను. దీనిద్వారా వారు మున్ముందు ఉత్తమశ్రేయస్సును బడయ నధికారులుగాఁగలరు. ఏమూఢులిట్లాచరింపఁజాలరో, వారు తమకాలిపై తామే గొడ్డలిని విసరికొనువారగుదురు.

## వీర్యనష్టము, దాని యాపదలు.

వీర్యనష్టము మైథునముచేత నేర్పడుచున్నది. మన శాస్త్రములలో మైథున మెనిమిది విధములని తెలియఁజేయఁబడియున్నది. అవ్వానినుండి తప్పించుకొనుటయే బ్రహ్మచర్యమని చెప్పఁబడెను:—

శ్లో॥ స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవచ॥
ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః।
విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః॥

1. జాగ్రదవస్థయందుఁగాని, స్వప్నమునఁగాని యేస్త్రీ

నైనను స్మరించుట, 2. ఆమెయొక్క సౌందర్యమును గుణముల ను బొగడుట। స్త్రీసంబంధమైన చర్చసేయుట లేక శృంగార ప్రధానములైన పాటలఁ బాడుట। శృంగార రసముగల దుర్గ్రంథముల బఠించుటయున్నగునది. 3 స్త్రీలతోఁగూడ చీట్లపేక చదరంగము మున్నగు వానిని ఆడుట. 4. స్త్రీని కామదృష్టితో జూచుట. 5 స్త్రీతో ఒంటరిగా గుసగుసలాడుట. 6. స్త్రీని బొందుటకయి మనస్సున సంకల్పించుట. 7. స్త్రీని బొందుటకయి ప్రయత్నము సలుపుట 8. సాక్షాత్తుగాఁ గలయుట. ఇవి యెనిమిదియు మైథునములే యని విద్వాంసులు వచించిరి. శ్రేయస్సుగోరువారీయెనిమిదింటి నుండియుఁ దప్పించికొనుట యత్యావశ్యకము. (ఈవిషయము పురుషులకేకాదు। స్త్రీలకును వర్తించును) పరస్త్రీతో మైథునము సలుపుట సర్వథా నిషిద్ధమనెడి విషయము నటుండనియుము. స్వస్త్రీతోనైనను నీయెనిమిది విధములైన మైథునముల నుండియు శ్రేయోఽభిలాషులు తమ్ము రక్షించికొనవలెను. స్త్రీతో నీయెనిమిదింటిలో నెవ్విధమైన సంబంధముచేత నైనను వీర్యనష్టము గలుగును. సాక్షాత్తుగాఁ గలియుటకంటె నన్యమైన యేఁడు మైథునములచేతను వీర్యము స్ఖలించి అండకోశములలోనికి వచ్చిచేరును. దీనిచేత ధాతువులయందు దౌర్బల్యము। స్వప్నవికారము, ప్రమేహము (మూత్రవ్యాధి) మూత్రకృచ్ఛ్రము (నీరుడివ్యాధి) రాజయక్ష్మ (క్షయరోగము

ముష్ణగునిట్టి వ్యాధుల నేకములు గలుగును. ప్రస్తుతకాలమున మైథునమునకు సంబంధించిన-అనైసర్గికములగు నుపాయములు పెక్కులు బయలుదేఱినవి. వీటిద్వారా సాక్షాత్తుగాఁ గలియుట చేతను వలెనే భయంకరమగు వీర్యనష్టమేర్పడుచున్నది. మఱియు నీ పాపాచారము ఉత్తరోత్తరము ప్రబలిపోవుచుండును దీని ఫలముగూడ చేఁజిక్కకపోదు, అయ్యయ్యో! ఇట్టివారు తప్పక నశింతురే! చూడుడు! ఈ పాపాచారము చేత మెదడు నాశనమగును. శరీరము దుర్బలమయి పోవును. దవడలెండిపోవును, ముఖము తేజోవిహీనమగును. జ్ఞాపకశక్తి నశించును, తలతిరుగ నారంభించును, హృదయమున నిరుత్సాహము గల్గును, కన్నులు మండుచుండును, ఆకలి చచ్చిపోవును, హృదయము "గాభరా" పడుచుండును, సుఖముగా నిద్రపట్టదు, మాంద్యము (బద్ధకము) ఆక్రమించును, సారాంశమేమన జీవనమే దుఃఖమయమగును, ఆయుర్వేదశాస్త్రమున మూలవ్యాధి-పాండరోగము-రక్తపిత్తము-క్షయరోగము దగ్గు-మూర్ఛ-దాహము, అగ్నిమాంద్యము, వాతము మున్నగు రోగములకు కారణము వీర్యమధికముగా నష్టమగుటయే యని స్పష్టపఱుపఁబడియున్నది. పాశ్చాత్య డాక్టరుయొక్క యభిప్రాయము గూడ నిదియే -ఇట్టియవస్థయందు భగవంతుని గూర్చి మననము-ధ్యానము సేయుటయెట్లు సంభవమగును? కావున మేలుగోరెడి ప్రతియొక్క మనుష్యుఁడును తాను స్వ

యముగా బ్రహ్మచర్యమును రక్షించుకొనవలెను, తమ బిడ్డ
లనుగూడ నిట్టి యనుష్ఠింపఁ జేయవలెను. తల్లిదండ్రుల
కిది ముఖ్యకర్తవ్యము. ఏమన;— గర్భాధానము నుండియే మిం
గుల జాగ్రతతో బాలురయొక్క భావిజీవనమును బ్రహ్మచర్య
ప్రతాపముచేత సుఖమయముగా నొనర్చుటకయి యుపాయ
ము సేయవలెను. ఎపుడు శిశువు గర్భస్థుఁడగునో, అప్పుఁడు
(ఇఁక) తల్లిదండ్రులు దుర్వాక్యములఁ బలుకరాదు. చెడ్డనవల
లు, నాటకములు చదువరాదు. చెడు సినీమాలు, నాటకము
లు చూడఁబోరాదు, శృంగారమునకు సంబంధించిన-చెడ్డదృ
శ్యములఁ బరికింపరాదు। భగవద్గీత మున్నగు సద్గ్రంథములఁ
బఠింపవలెను. భక్తులు। పుణ్యాత్ములు, వీరులునగు వారియొ
క్క చరిత్రలఁ జదువవలెను, వినవలెను. గర్భకాలమునఁ దల్లి
యెట్టిచేష్టలు గలదియగునో సంతానముగూడ నట్టిదే లభించు
ను. ఈవిషయమును ప్రాచ్య పాశ్చాత్యజ్ఞాన వేత్తలును అంగీ
కరించియున్నారు. వీరుఁడు, నవయువకుఁడునగు నభిమన్యుఁడు
పద్మవ్యూహమును భేదించుటను సుభద్రయొక్క గర్భమున
నుండఁగనే నేర్చుకొనియెనట. భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడు
తల్లిగర్భమున నుండఁగనే భక్తిప్రభావమును గ్రహించియుం
డెను. ఈవిషయమున నింకను ననేక దృష్టాంతములు గలవు.
శిశువు జన్మించిన మీఁదట తల్లిదండ్రులు వీఁడేమియుఁ దెలి
యనివాఁడని వాని యెదుట నెన్నఁడును చెడ్డమాటలు

మాట్లాడుటగాని, చెడ్డ చేతలు చేయుటగాని తగని పని. వానియెదుట వివాహమునకు సంబంధించిన చర్చనైతము సలుపరాదు. విద్యాభ్యాసమునకు యోగ్యుడైన పిదప వానిని బ్రహ్మచర్యముయొక్కయు ధర్మముయొక్కయు, శిక్ష (నేర్పుట) కు సంబంధించిన తగినయేర్పాటులుండునో, అట్టి సత్ప్రవర్తనగల సద్గురువులొద్దకు బంపించవలెను. నేటికాలపు-స్కూళ్ళ [కాలేజీల] యొక్క దుర్దశ చెప్పనలవిగాకున్నది. ఎట్టి బాలకులు దుష్ప్రవర్తన గలవారుగానుండరో, యిట్టి స్కూలు లేక కాలేజి యెచ్చటనైనను బహుశః (అదృష్టవశమున) ఒక్కటియైనను నుండియుండునేమో మిగుల శోచనీయమైనవిషయము. నేడు మన భావిభాగ్యము నాశించునట్టి మన భారతమాతయొక్క ప్రియబాలకుల జీవనశక్తి విద్యాభ్యాసమనెడి పేరుపై మిగుల పాడయిపోవుచున్నది-ప్రప్రథమమున పాశ్చాత్యవిద్యాభ్యాసమనెడి విషపువ్యాధియే బాలకుల స్వధర్మమునుండి భ్రష్టులజేయుచున్నది. రెండవది నేటికాలపు స్కూళ్ళకుసంబంధించిన, లౌకికవిషయప్రధానమై చెడిపోయిన వాతావరణము-బాలుర జీవనాధారమగు శక్తినంతయు వినాశమొనర్చుచున్నది. మనభారతీయుల జీవనమున నిది గొప్పపీడయై వర్తిల్లుచున్నది. ఒకవేళ నిట్టియాపదనుండి రక్షింపబడనిచో గొప్పయనర్థమువాటిల్లునని శంకపొడముచున్నది. ఈవిషయమునబుద్ధిమంతులైనవారు వెంటనే మేల్కొనవలసియున్నది.

చక్కఁగా నింద్రియముల నియమించి బ్రహ్మప్రాప్తికయి యరణ్యవాసులై త్యాగులైయున్న గురువులయొక్క ఆశ్రమములలోనుండి యన్నివిధములైన సద్విద్యల నభ్యసించుచున్నట్టి స్తుతింపదగిన ఆ యాచార్యమెక్కడ! గొప్పగొప్పభవనములలో తలమ ఇంద్రియనిగ్రహములేని ధనాశాపరులగు నుపాధ్యాయులద్వారా విషయములలో ముంచి తేల్చునట్టి జడవాదమునందగుల్పఁజేయు నిస్సారమైన అవిద్యాస్వరూపమగు నేఁటి విద్యయొక్క శిక్షణమెక్కడ! ప్రాచీనగురుకులములకుఁబోయి నివసించునట్టి బ్రహ్మవాసులగు విద్యార్థులయొక్క పవిత్ర జీవనమును గొంచెము పరిశీలింపుఁడు. బాలకులు విద్యాభ్యాసమునకు యోగ్యమైనవయస్సు రాఁగానే ఉపనయనసంస్కారముచే సంస్కరింపఁబడి మాతాపితరులను, ఇండ్లు - వాకిండ్లను విడిచి యొంటరిగా-సమిత్పాణులై త్యాగులు, భిక్షుకులు, వనవాసులునగు గురువులయొక్క ఆశ్రమములకుబోయెడివారు. వారు గురువును పరమేశ్వరునిగాభావించి అన్నివిధముల శుశ్రూష సేయుచు బ్రహ్మచర్యాశ్రమముయొక్క కఠిన నియమములఁ బాలించుచు శ్రద్ధాభక్తులతో సద్విద్య నభ్యసించెడివారు.

బ్రహ్మచారికొఱకైన నియమములు:-

శ్లో॥ సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్।
సంనియమ్యేన్ద్రియగ్రామం తపో వృద్ధ్యర్థమాత్మనః॥
నిత్యం స్నాత్వా శుచిః కుర్యాద్దేవర్షిపితృతర్పణమ్।

దేవతాభ్యర్చనం చైవ సమిదాధానమేవ చ।
వర్జయేన్మధుమాంసం చ గంధం మాల్యం రసాన్
స్త్రియః।
శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్।
అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్।
కామం క్రోధం చ లోభం చ నర్తనం గీతవాదనమ్॥
ద్యూతం చ జనవాదం చ పరివాదం తథాఽనృతమ్।
స్త్రీణాం చ ప్రేక్షణాలంభముపఘాతం పరస్య చ।
ఏకశ్శయీత సర్వత్ర న రేతస్స్కందయేత్క్వచిత్।
కామాద్ధి స్కందయన్రేతో హినస్తి వ్రతమాత్మనః॥
స్వప్నే సిక్త్వా బ్రహ్మచారీ ద్విజశ్శుక్రమకామతః।
స్నాత్వాఽర్కమర్చయిత్వా త్రిః పునర్మామిత్యృచం
జపేత్॥ (మనుస్మృతి 2 అ 175-181)

బ్రహ్మచారియైనవాఁడు గురుకులమున నివసించుచు నింద్రియనిగ్రహముతోఁబాటు తపోవృద్ధికై యీ నియమములఁ బాలింపవలెను. స్నానముఁజేసి శుచియై నిత్యము దేవ ఋషిపితృతర్పణమును జేయవలెను. అగ్నికార్యమును, దేవతార్చనమును నాచరింపవలెను. మద్యమాంసములను, సుగంధవస్తువులను, పుష్పమాలికాదులను ధరింపరాదు. ఉద్రేకమును గూర్చు రసపదార్థముల సేవింపరాదు. స్త్రీని వర్జింపవలెను. పులిసిన పదార్థములఁబుచ్చుకొనరాదు. ఏప్రాణిని హింసింపరాదు. తైలా

దులతో దేహమర్దన లేక తలంటుకొనుటగాని కూడదు. నేత్రములను కాటుక మున్నగువానిచే నలంకరింపరాదు. చెప్పులు, గొడుగు ధరింపరాదు, కామ, క్రోధ, లోభాదులం బరిత్యజింపవలెను. నాట్యము, గానము, వీణాది వాద్యమును విడవవలెను. జూదము, నిరర్థక వాదము, పరనింద, అసత్యము వీని నాచరింపరాదు. స్త్రీని జూచుటయు స్పృశించుటయుం గూడదు. పరుల కపకారము సేయరాదు. సర్వత్ర ఒంటరిగా (భూమియందు) శయనింపవలెను. ఇచ్ఛాపూర్వకముగా నెన్నడును రేతస్సును స్ఖలింపం జేయరాదు, అట్లు స్ఖలింపం జేసికొనినవాఁడు తన వ్రతమును నశింపం జేసికొనినవాఁడగును. ఇచ్ఛాపూర్వకముగాం గాక స్వప్నమునందొకవేళ స్ఖలించినయెడల నట్టి బ్రహ్మచారి స్నాతుఁడై ప్రాతఃకాలమున సూర్య నారాయణుని నావాహనము సేసి అర్చనసేసి పిదప "పునర్మామైత్విన్ద్రియం" * అను నీ మంత్రమును మున్మారు జపింపవలెను. దీనికిది ప్రాయిశ్చిత్తము. (దీనిచే మఱల తనకు తేజస్సు లభించును.) ప్రతి

*పునర్మామైత్విన్ద్రియమ్। పునరాయుః పునర్భగః। పునర్బ్రాహ్మణమైతు మా। పునర్ద్రవిణమైతు మా। యన్మేఽద్య రేతః పృథివీమస్కాన్। యదోషధీరప్యసరద్యదాపః। ఇదం తత్పునరాదదే। దీర్ఘాయుత్వాయ వర్చసే। యన్మే రేతః ప్రసిచ్యతే। యన్మ ఆజాయతే పునః। తేన మామమృతం కురు। తేన సుప్రజసం కురు॥ [తై. ఆ. 30 అ.]

నులగు బ్రహ్మచారుల యొక్క నడవడి యిట్లుండెను. రాజ కుమారులయందును, దరిద్రులయందును, భిక్షాన్నము చేజీవించు బాలకులయందును నీ నియమములలో భేదమేమియు నుండెడిది గాదు. భగవానుఁడగు శ్రీకృష్ణుఁడును, దరిద్రుఁడగు సుదాముఁ (కుచేలుఁ) డును గలసి సాందీపునివద్ద విద్యాభ్యాస మొనర్చిన కథ ప్రసిద్ధమే కదా! ఇఁక నిప్పుడు ఇట్టి బ్రహ్మచారులకును నేఁటి విద్యార్థులకును గల తారతమ్యమును గనిపెట్టుఁడు. ఇంద్రియనిగ్రహము గలవారు, నమ్రతగలవారు. గురుసేవకులు, త్యాగులు, విలాసశూన్యులు. పవిత్రమైన మనోవాక్కాయములు గలవారు, ధర్మజ్ఞానములలో నిపుణులు, ఈశ్వరుని యందు భక్తిగలవారు, దండమేఖలాధారులు, నిష్కపటహృదయులు నగు నా బ్రహ్మచారులెక్కడ! ఇంద్రియలోలురు, మదోన్మత్తులు, ప్రొఫెసర్లను హాస్యము సేయువారు, విషయలోలురు, దర్జా-షోకు గలవారు, అపవిత్రమైన మనోవాక్కాయములు గలవారు, ధర్మద్రోహులు, ఈశ్వరుని నిందించు నాస్తికులు, బూటు, సూటు, రిష్టువాచి, కండ్లజోడు, చర్మపు (బేగ్) సంచులను ధరించు దురభిమానులు, ఇట్టివే యగు నేక ఫేషన్లతో నుండువారు నగు నిప్పటి స్కూళ్ల విద్యార్థులెక్కడ! ఎంతటి భయంకరమైన పరివర్తనము గలిగెను! స్వర్గమువంటి మన భారతదేశము నేఁడు నరకార్ణవమయ్యెనే! ఋషిసేవితము వేదఘోషచేఁ బవిత్రీభూతము, యజ్ఞశాలలచే నలంకృతము

వ్రతమునుండి భ్రష్టులఁజేయుటయే హిందూధర్మశాస్త్రాను సారముగా వివాహమనునది కేవలము విలాసమునకును నింద్రియలోలత్వమునకును సాధనముగా నేర్పడినది గాదు. వివాహమన, పవిత్రమైన అత్యావశ్యకమగు నొకసంస్కారము. వివాహము గృహస్థాశ్రమమునకుఁ బునాది. స్త్రీ పురుషు లిరువురు నేకత్వమును సంపాదించి పవిత్రప్రేమతో నొకేటే సూత్రమున బంధింపఁబడి ధర్మాచరణమున బ్రవర్తించుటయు. శక్తిననుసరించి మూఁడాశ్రమములవారికిని సేవఁజేసి భగవత్ప్రాప్తికి సంసిద్ధులగుటయు నిదియే యీయాశ్రమోద్దేశము. ఎన్నడు దంపతులు కామము, క్రోధము, లోభము అనువాని నుండి రక్షింపఁబడి భగవద్భావనతో లోకసేవఁజేసి శాస్త్ర పద్ధతి ననుసరించిన ఆవశ్యకములగు వ్యవహారముల నన్నింటిని నొనర్చి దేవ - ఋషి - పితౄణములనుండి విముక్తులయ్యెదరో అప్పుడుమాత్రమే గృహస్థాశ్రమము సార్థకముగాఁగలదు. శాస్త్రమెటులఁ జెప్పుచున్నదో గమనింపుఁడు. "పుత్రార్థే క్రియతే భార్యా" అనఁగా పుత్రార్థమై యే భార్యను గ్రహింప వలెను, విలాసవాసనకయి కాదు స్త్రీయన సహధర్మచారిణి. ఆమె విలాసమునకు సాధనముగాదు. వివాహమనునది ఒక విధమైన కట్టుబాటు-హద్దుతోఁ గూడినది. ఇయ్యది తనను బంధనమునకు నాశ్రయమిచ్చునదిగా నేర్పడియుండలేదు. నేఁడు మనమీయుత్తమ సత్యమును మఱచిపోతిమి. కావుననే

స్వర్గములోని నందనవనమును బోలిన మనయొక్క గృహస్థా
శ్రమమును నేఁడు నరకపురిగా మార్చినది. గాన స్త్రీ యొక్క
మాహాత్మ్యమును, దానియందు [illegible] వివాహమునకు
సంబంధించిన ధార్మికశక్తులను దెలిసి మనము దానిని [illegible]
సుశిక్షాసనమునకు ద్వారముగాఁ జేసికొనిన శాస్త్రము [illegible]
చున్నది. ఇరువదియైదు సంవత్సరములవఱకు గురుకులవాసము
జేసి పిదప నా యువకుఁడు విద్యాబలసంపన్నుఁడై యెప్పుడు
స్వయముగనే తన జీవనము నిర్వహించికొన సమర్థుఁడగునో
అప్పుడు మాత్రమే ఆతఁడు గృహస్థాశ్రమ పవిత్రద్వారమునఁ
బ్రవేశింప నధికారి యగుచున్నాఁడు, అని. నేఁడు మనమీ
యుత్తమ వ్యవస్థను మఱపించి యేమియుఁ దెలియని బాలురకు
ను బాలికలకును బొమ్మలకువలె వివాహమునుఁ జేసి వారి
యొక్క భావి జీవనమును చేతులార నాశనమొనర్చుచున్నాము
ఏ బిడ్డలకు వస్త్రధారణ చేయుటకును దగిన జ్ఞానము గలుగ
లేదో, వారిని మనము గృహస్థాశ్రమమను కఠిన బంధనమున
బంధించుచున్నాము. వివాహమునందు భార్యాభర్తలిరువురు
నేమి ప్రతిజ్ఞ చేసికొనుచున్నారో, పాపమా పసిబాలుర
కేమి దెలియును? బాలురు కేవలము వివాహమనిన నొకయా
నందప్రదమైన విషయమునుగా భావించి దాని యుత్సవములో
మునిఁగిపోయెదరు, కాని యే బుద్ధిమంతులిట్టి బాల్యవివాహ
ములయొక్క పరిణామమును గుర్తింపగలరో, వారు ఏమియుఁ

దెలియని బాలురయొక్క యీ యుల్లాసమును జూచి జూచి గొనరా! మఱి యువకుల దురవస్థను బరికింపుఁడు! పూర్ణ యౌవనము రాకమునుపే ముసలితనము వీరి నాక్రమించు చున్నది. స్త్రీలయొక్క స్థితియు నట్లే యున్నది. ప్రదరము (రక్తస్రావరోగము) చేతగాని, లేక రజోనిరోధము చేతఁగాని బాధింపఁబడని యువతి బహుశః ఎచ్చటనైనను ఒకానొకతె యుండునేమో! యువకులయొక్కయు, యువతులయొక్కయు దురవస్థను గనినట్లైనచో హృదయము కంపించిపోవు చున్నది. అయ్యయ్యో! మొగ్గలు (పుష్పములై) వికసింపక మునుపే మాడి, వాడిపోవుచున్నవే! ఇంతకంటె నధికమైన దురవస్థ గృహస్థునకింకేమి యుండును? తల్లిదండ్రులకుఁ దమ బిడ్డలపై నత్యంతప్రేమ. ఈవిషయమున నేమియు సంశయము లేదు. వారు ఎఱిగి యెఱిగియే తమబిడ్డలకు అనిష్టమును గలుగఁజేయరు; కాని వారిహృదయము అజ్ఞానముచే నావరింపఁ బడియుండును, కనుకనే వారిట్టి పొరపాట్లు సేయుచున్నారు. బ్రహ్మచర్య మహిమను మఱచుటయే యీ పొరపాటునకుఁ బ్రధానకారణము. కాని యీ పొరపాటెంతమాత్ర ముపే క్షింపరానిది సుమీ! ప్రకృతి వీరికి మహానర్థమును వీరి యఱచేతులలోఁ దెచ్చిపెట్టును. కాన తల్లిదండ్రులుగాని, సంఘములోని పెద్దలుగాని తమబిడ్డలకు వివాహమును యుక్త వయస్సు రాకమునుపెన్నఁడును జేయరాదు. వధూవరుల

యొక్క వివాహమునకు యోగ్యమైన వయస్సు కనీసము 16, 15 సంవత్సరములైనను అత్యావశ్యకముగా నుండవలెను. మనుమహారాజు (మనుస్మృతికర్త) యోగ్యుఁడైన వరుఁడు లభింపని పక్షమున రజస్వలయైన తరువాత నింకను మూఁడు సంవత్సరములవఱకు మాత్రము యోగ్యుఁడైనవరుని నిరీక్షించు కొనుటకై అనుజ్ఞనిచ్చియున్నాఁడు. ఇంతియే కాదు. కన్య జీవిత పర్యంతము బ్రహ్మచారిణిగనే యుండిన యుండుఁగాక. ప్రమాదము లేదు కాని యయోగ్యుఁడైన వరునకిచ్చిమాత్రమాయెను వివాహము సేయరాదు, అని శాసించియున్నాఁడు. కాని యీ శాసనము యోగ్యుఁడైన వరుఁడు లభింపని పక్షమందే. ఏమనుష్యులు తమ కన్నియను ధనలోభముచేతఁగాని, ప్రమాదవశమునఁగాని, కన్యకుఁదగిన వయస్సులేనివానికిఁగాని, వృద్ధునకుఁ గాని యిచ్చి వివాహము సేయుదురో వారు మహాపాపమొనర్చినవా రగుదురు. ధర్మశాస్త్రముయొక్క వాక్యమును బరిశీలింపుఁడు:—

శ్లో॥ కన్యాం యచ్ఛతి వృద్ధాయ నీచాయ ధనలిప్సయా।
కురూపాయ కుశీలాయ స ప్రేతో జాయతే నరః॥

ఏ మనుష్యుఁడు ధనాశచేతఁదన కన్నియను వృద్ధునకు (మిగుల పెద్దవయస్సుగలవానికి) గాని, నీచునకు (తగిన వయస్సు లేనివానికి) గాని కురూపునకు (ఏదేని యవయవము లోపించినవానికి) గాని యిచ్చి వివాహమును సేయునో, అతఁ

డు మరణించిన పిదప ప్రేతత్వమును పిశాచత్వమును బొందు
ను అని చెప్పఁబడియున్నది. కాన యోగ్యుఁడైన వరుఁడు లభించు
నెడల రజస్వల గాఁబోవు దినములలో వివాహము సేయుట
యవసరము. అన్ని ప్రదేశములలో నింత చిన్నవయస్సులోనే
రజస్వల అగుట గనఁబడదు. తల్లిదండ్రులకు లేక సంఘము
లోని పెద్దలకు ధర్మమార్గమున బాగుగా లక్ష్యమే యుండిన
బాలికలింత చిన్నవయస్సులో రజస్వలలు గాకుందురు. బాలి
కల యెదుట వారిని గూర్చిన వివాహచర్చలు సేయకుండినను
వారిచే పరిశ్రమఁ జేయించినను స్త్రీ పురుషుల శృంగార చేష్ట
లు వారికిఁ జూచునట్టి స్థితిలభింపక పోయినను, శృంగారము-
పోషు చేసెడు భావము నుత్పన్నముఁ గానీయక పోయినను,
పురుషుల బాటు తఱుమరాకపోకలు లేకుండ చేసినను,
బాలురు జదువుకొను స్కూళ్లకు బాలికల బంపించకపోయి
నను స్వాతంత్ర్యము గలుగకుండునట్లు వారిని గాపాడినను,
బాలికలింత చిన్నవయస్సులో రజస్వలలు గాకయేయుందురు.
చాలభాగము ధనికులయొక్క కన్యలే త్వరలో రజస్వల లగు
చున్నారు. దీనికిఁ గారణము ఆ బాలికలకు చిత్రవిచిత్రములైన
చీరెలు మున్నగునవియుఁ బలువకముల యాభరణములును
ధరించుటకు లభ్యపడుచుండును. వారి నెంతమాత్రము పనులు-
పరిశ్రమలు చేయుంపరు. దుష్టులగు నౌకర్లతోను, దాసీపని
సేయు దుష్టస్త్రీలతోను సహవాసము గలిగియుందురు.

ఉద్రేకమును గలిగించు ఋతుబంధనములు దొఱకుచుండును. కావున బాలికలింతచిన్నవయస్సులోనే రజస్వలలగుచున్నారు ఏ బాలురు లేక బాలికలు భగవత్ప్రాప్తికొఱకు జీవితపర్యంతము అథవా హెచ్చుకాలము బ్రహ్మచర్యవ్రతమును బాలింప నిచ్ఛగలిగియుందురో వారికిఁ బ్రత్యేకస్వాతంత్ర్యము నీయవలెను. ఏల? యన నిది చాలా కుటిల ప్రశ్న.

—। గృహస్థాశ్రమములో బ్రహ్మచర్యము. ।—

కొందఱి దురుద్దేశ్య మివ్విధమున నున్నది. వివాహము చేసికొనిన స్త్రీతోఁ గూడ పురుషుఁ డెట్లు ప్రవర్తించినను పరవాలేదు. అది ధర్మవిరుద్ధముగాదు అని యభిప్రాయపడుచున్నారు. ఇందుకే యే గదా భగవంతుఁడిట్టి నియమము నేర్పాటు చేసెను, అని తలంతురు కాని యియ్యది చాలా పొరపాటు వాస్తవమున నెవరికిని నెవరును భార్యగాని, భర్తగాని కారు. వారి వారి కర్మానుసారము జగన్నియంతయగు నా భగవాను నియొక్క యీ జగదాశ్రమమైన నాట్యశాలయందు పాత్రుచేయుటకొఱకే యే జీవులు ఒకప్పుడు స్త్రీరూపముగను, మఱొక ప్పుడు పురుష రూపముతోను ఇంకొకప్పుడు తల్లి, బిడ్డల యొక్క వేషముతోను వచ్చుచున్నారు. ఇట నీ యాట (నటనము) పూర్తి యగులోడనే వారి వారి కర్మఫల మునకుఁ దగినట్లుగా నా నటరాజు (పరమేశ్వరుఁడు) ఎచ్చోట నెట్టి న టనమును జేయింపఁ దలంచి వారినిఁ బ్రేరేపించుచున్నాఁడో,

అప్పటికే వారు మఱొక వేషముతో వెళ్ళవలసియుండగను దేనికి సంబంధించిన యేవేషము ఎక్కడ నెట్లుండవలయునో అక్కడ దానికి సంబంధించిన యావేషము ననుసరించియే నటనము సేయుట వారికిఁ గర్తవ్యమై యుండును. మన యీ జీవితమునందు, నే స్త్రీతోఁ గూడి దంపతిరూపమున నియోగింపఁబడవలసి యుండునో అయ్యది భగవదాజ్ఞానుసారము భగవదిచ్ఛానుసారముగనే యుండును. కాన నియ్యది ధర్మబద్ధమైన విషయముగాని కామేచ్ఛను బూర్తి సేయుటకు మాత్రము సాధనము గానేరదు ఎవ్వఁడు దంపతులయొక్క యీ ధర్మయుక్తమైన సంబంధమును గ్రహించి యింద్రియనిగ్రహపూర్వకముగా జీవితమున సకలకార్యములను స్టేజిపై పార్టు చేయునట్టి యొక్టరువలెనే తనదేమియు లేదని నిష్కామ భావముతో లాభమున నేమి, నష్టమున నేమి సమబుద్ధిగలవాఁడై భగవదర్పణబుద్ధితో నాచరణసేయునో, ఆ గృహస్థుఁడు మాత్రమే పరమేశ్వరానుగ్రహమును సంపాదింపఁజేసికొనుటకు యథార్థమైన యధికారియగును. మనుష్యుఁడే జ్ఞానప్రాప్తికధికారిగా నున్నాఁడు. కాన నతఁడు తదితర ప్రాణులకంటె శ్రేష్ఠుఁడుగాఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. కామోద్రేకముచే వివేకము లేనివాఁడగుట పశుధర్మము. సత్యము విచారించినచో నేఁడు మన స్థితి పశువులకంటెను నికృష్టమయి పోయినది. పశువులను జూడుఁడు! నేటికిని యవి చాలా నియమములఁ

కాపాడుకొనుచునే యున్నవి. గర్భధారణమైన పిదప మాత్రము స్త్రీపశువు కాని పెంటిమగల పొగపశువు నెన్నఁడైనను తన సంగముకే రానీయదు. పశువులయొక్క స్థితి యిట్లున్నది. కావుననే మనకంటె బలమున నవి మిగుల గొప్పవిగా నున్నవి. ఇఁక మన మెట్టి నియమములకు దాసులమైనామో పరికింపుఁడు. పశువులకంటె మిగుల దక్కువ బలము గలవారమైనను వానికంటె హెచ్చుగా నింద్రియచాంచల్యము గలవారమయి ప్రకృతి నియమముల దాటి పనేరకున్నాము. శాస్త్రమెట్లు చెప్పుచున్నదో గ్రహింపుఁడు:—

శ్లో॥ బ్రహ్మచర్యం సమాప్యాఽథ గృహధర్మం సమాచరేత్।
ఋణత్రయవిముక్త్యర్థే ధర్మేణోత్పాదయేత్ప్రజామ్॥

బ్రహ్మచర్యము పూర్తియైన పిమ్మట యౌవనావస్థ యందు గృహస్థ ధర్మమునఁ బ్రవేశించి దేవర్షి పితౄణముల నుండి విముక్తుఁడగుటకయి ధర్మపద్ధతిని నొక్క సంతానమును గనవలెను, అని. వాస్తవమునకిట్టి ధర్మబద్ధులగు నింద్రియ నిగ్రహముగల గృహస్థులు మాత్రమే ఓజస్సంపన్నులు, తేజోవంతులు బలవంతులును గాఁగలరు. వివాహసమయమున నొక మంత్రముగలదు. ఇయ్యది వరుఁడు కన్యకతోఁ జెప్పునది.

"ఓం గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసః। భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః। అమోఽహమస్మి సా త్వం సా

త్వమస్యమో అహమ్। సామాహమస్మి ఋక్ త్వం ద్యౌరహం పృథివీ త్వం తావేహి వివహావహై సహ రేతో దధావహై ప్రజాం ప్రజనయావహై పుత్రాన్విన్దావహై బహూంస్తే సన్తు జరదష్టయః। సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం శృణుయామ శరదశ్శతమ్॥”

(పార. కాం. 6. 3)

అనఁగా నో మంగళస్వరూపిణీ! నేను నాయొక్క కాంతి, శ్రీ, మహిమ, జ్ఞానము, ధర్మము మున్నగువాని రక్షణకయ్యే నిన్ను స్వీకరించుచున్నాను. నీయాత్మ (అంతఃకరణము) నాయాత్మ యొక్కఁడును భిన్నముగాకుండును గాక! మనమిరువురము నొకపర్యాయమే వార్ధక్యము నొందుదుముగాక! భగుఁడు, అర్యముఁడు సవితృ మున్నగు దేవతలు నిన్ను నాతో సంబంధము కలదానినిగా నొనర్చిరి. నీవు నీ గృహకృత్యముల నడపుము. ఓకల్యాణీ! నీద్వారా నాకు కాంతి, శ్రీ, కాంతి మున్నగునవి ప్రకాశము నొందును గాన నీవు లక్ష్మీసమానవు. నీవులేక నాకు కాంతి, శ్రీ మున్నగునవి లేనివేయగును. నే నేకాకినైనఁ ప్రకాశములేనివాఁడ నయ్యెదను. ఓ మంగళస్వరూపిణీ! నిన్నుఁజేరి నేఁ ప్రకాశవంతుఁడ నైతిని. ఓఆయుష్మతీ! నేను సామరూపుఁడను. నీవు ఋగ్రూపిణివి. ఋక్కునకును సామమునకును నెట్లు దృఢసంబంధముగలదో ఋక్కులేక సామమునకెట్లు బలము-సత యుండనేరదో, ఇటే నీవు

లేక వారికిఁగాని నాయింద్రియములకుఁగాని పుష్టి-సత్త్వయుండ నేరదు. ఓ అర్ధాంగినీ! నే నాకాశరూపుఁడను. నీవు పృథివీ స్వరూపిణివి పృథివ్యాకాశముల కెట్లు అన్యోన్యసంబంధము గలదో, ఇట్లే నీతో నాకు సంబంధము గలదు. కాన నో కల్యాణీ! నీవు నిన్ను నా కాత్మసమర్పణ మొనర్చికొనుము. మన వివాహ సంబంధము మిగుల దృఢముగానుండునుగాక! మనమిరువురము నింద్రియనిగ్రహము గలవారముగా నుండవలయును. యోగ్య కాలమున సత్సంతానము నుత్పన్నముఁ జేయుదుముగాక! ఆ సంతతివలని సుఖము మన మనుభవింతుము. ధర్మపద్ధని పుత్రోత్పాదనమైన పిదప నా సంతానము దీర్ఘాయుష్యము గలది యగును. మన యిరువుర యంతఃకరణము అభేదము గలది గాఁగా మనమిరువురము తేజోవంతులముగానుందుము. మన హృదయము వైశాల్యము గలదియగుగాక. మనము నూఱు వత్సరములు జీవింతుముగాక. నూఱు వత్సరములఁ జూతుము గాక. నూఱు వత్సరములు (శుభమును) విందుముగాక. (అని వరుఁడు సెప్పుచున్నాఁడు) దీనినిబట్టి యా ధర్మకాలమున నూఱుసంవత్సరము లాయుష్యముండెడిదని స్పష్టమగుచున్నది. "మన మిరువురము నింద్రియనిగ్రహము గలవారమగుదుము గాక" అనెడి యీప్రతిజ్ఞ [ప్రమాణము] ననుసరించినచో నీ యవ్వది సంభవించును. ఇంద్రియనిగ్రహమే లేనిచో నియ్యది యసంభవమగును. మఱియు బలవంతమును, బుద్ధిబల యుక్త

ములకు సంతానముగూడఁ గలుగనేరదు. నేఁడు ఇంద్రియ నిగ్రహము లేకపోవుటచేతనే మనకు, మన సంతానమునకు నెట్టి దశ యేర్పడినదో చూడుఁడు. దేహము కేవలము దుఃఖ పంజరమే. ఇఁక మనస్సో క్రోధస్థానము, ధర్మాధర్మవివేకశూన్యమయ్యెను. కనుకనే నేఁడు మనము "సంతానార్థం హి మైథునమ్" సంతతి నిమిత్తమే సంగమ మనెడి శాస్త్రోక్తిని బరిహసించుచున్నాము. మహాత్మ యాజ్ఞవల్క్యుఁడిట్లు నుడివెనో గ్రహింపుఁడు (*)—

శ్లో॥ ఋతావృతౌ స్వదారేషు సంగతిర్యా విధానతః।
బ్రహ్మచర్యం తదేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్॥

శాస్త్రమున విధింపబడిన రీతిని ఋతుకాలమునఁ దన ధర్మపత్నితో కేవల సంతానార్థమే సంపర్కము సేయుపురుషుఁడు గృహస్థాశ్రమమున నుండియు నాతఁడు బ్రహ్మచారియే అని చెప్పఁబడియున్నాఁడు. కేవల ఋతుకాలమునందే స్త్రీతో సంబంధము విధింపఁబడినది గాని కాలనియమము లేక నిరాటంకముగఁ గాదని గుర్తించికొనవలెను. ఋతుకాలమన నేమియో చెప్పఁబడుచున్నది. స్త్రీ రజస్వల బహిష్ఠ) యైన నాల్గవ దినమే ఋతుకాలముగాదు. ఏలయన ఆనాఁడు ఏదేని గ్రహము గాని, శ్రీరామనవమి, కృష్ణాష్టమి మొదలైన పర్వదినములు గాని వచ్చినచో నారోజున స్త్రీసాంగత్యము నిషేధింపఁబడినది, భగవానుఁడగు మనువు ఋతుకాలమున స్త్రీసంసర్గము కర్త

ష్యమని చెప్పియున్నారు, కాని "పర్వవర్జమ్" అని పలికియున్నారు. అనగా వానిలో ఏదేని పర్వ (పుణ్య) దినమైనచో మాత్రము కూడదని నిషేధించియున్నారు. ఋతుకాలమును గూర్చి మనుమహారాజు చెప్పినది; —

శ్లో॥ ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః।
చతుర్భిరితరైః సార్ధమహోభిః సద్విగర్హితైః॥
తాసామాద్యాశ్చతస్రస్తు నిన్దితైకాదశీ చ యా।
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః॥ 3 46,47

సత్పురుషుల ద్వారా నిందింపబడిన, రజస్వలకు సంబంధించిన మొదటి నాలుగు రోజులతో సహా మొత్తము పదునారు రాత్రులు స్త్రీలకు స్వాభావికమైన ఋతుకాలమని చెప్పబడినది. ఈ పదునారింటిలో మొదటి నాలుగు రాత్రులును 11 వ రాత్రియు 13 వ రాత్రియు స్త్రీసంసర్గమునకుం బనికి రావు. ఇంక మిగిలిన పది రాత్రులు యోగ్యమైనవిగా భావింపం బడుచున్నవి. ఈ పది రాత్రులలోను పాడ్యమి, షష్ఠి, అష్టమి, ఏకాదశి, ద్వాదశి చతుర్దశి, పూర్ణిమ యీ తిథులను, వ్యతీపాతము గ్రహణము శ్రీరామనవమి శివరాత్రి, జన్మాష్టమి, శ్రాద్ధదినము, సంక్రాంతి, ఆదివారము మొదలగు నిషిద్ధదినములు సంప్రాప్తించిన విడిచి పుచ్చి ఆ పదిరాత్రులలో నెన్ని రాత్రులు మిగులునో వానిలో సంతానము లేనియెడల సంతానేచ్ఛచేగాని స్త్రీయొక్క యిచ్ఛచేగాని మాసమంతటిలో కేవలము

ఒకటి లేక రెండు పర్యాయములుమాత్రమే యెవఁడు స్త్రీసంసర్గము సేయునో, ఆతఁడు గృహస్థుఁడైనను బ్రహ్మచారిగనే పరిగణింపఁబడియున్నాఁడు. మనుమహారాజు మనకొకచోటఁ జెప్పినది: —

శ్లో॥ నిన్ద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్
బ్రహ్మచార్యేవభవతి యత్ర తత్రాశ్రమే వసన్॥ (3 50)

పదునాఱు రాత్రులలోఁ బదునాల్గింటిని విడిచి (పర్వదినములు గానివో పుత్రార్థమై) రెండు పర్యాయములు స్త్రీసంసర్గము సేయువాఁడు గృహస్థుఁడైనను బ్రహ్మచారియే యగునని దీనికిఁ దాత్పర్యము. రజస్వలతో నెన్నఁడును సంసర్గము సేయరాదు. ఇది యధర్మమగుటయేకాక దీనిచేతఁ బలురకముల వ్యాధులును గలుగును, ఇంతియే కాదు. ఆశ్లేష, మఖ, మూల, కృత్తిక, జ్యేష్ఠ, రేవతి, ఉత్తరాభాద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ యీ నక్షత్రములయందును స్త్రీసంసర్గము నిషేధింపఁబడినది. మఱియు దేవాలయము మున్నగువానియందు, మార్గము (దారి) యందు శ్మశానమందు, ఔషధశాలయందు, బ్రాహ్మణగృహమందు, గురువుయొక్క గృహమునందు ప్రాతఃకాలమునందు, సంధ్యాకాలమునందు, అపవిత్రముగానున్న స్థితియందు, ఔషధ సేవనానంతరము, మిగుల నాకలియందు, భోజనానంతరము మిత్రులు లేక పెద్దవారియొక్క పడకలయందు మలమూత్రముల యొక్క యవసరమునందు, మనస్సు నచింతగానున్నప్పుడు

ఉద్రేకము, క్రోధముతో నున్నప్పుడు, వ్యాయామము చేసిన పిదప, అలసి యున్నప్పుడు, ఉపవసించిన రోజున ఇట్టి విధి యందు స్త్రీస్పర్శ మెంతమాత్రము గూడదు. స్త్రీసంసర్గ విషయమున గ్రీసు (దేశ) మహాత్ముఁడగు సోక్రటీసునకు. వారియొక్క ఒక శిష్యునకును జరిగిన సంభాషణ:—

[గృహస్థులకు ముఖ్యముగా గ్రహింపదగినది.]

శిష్యుఁడు:— పురుషునకు స్త్రీసంసర్గ మెన్నిమార్లు కర్తవ్యము?

సోక్రటీసు;- జీవితములో కేవలము ఒక్క పర్యాయము.

శి,- దీనితోఁ దృప్తి యేర్పడని యెడల?

సో;— అట్లైన సంవత్సరమున కొక్క పర్యాయము చేయవచ్చును

శి:— దీనికిని మనస్సు కుదుట పడనిచో?

సో,- మాసమున కొకపరి చేయవచ్చును.

శి;— అట్లుగూడ నుండలేక పోయినచో?

సో:- సరే. మాసమునకు రెండు పర్యాయములు. కాని నాయనా! ఇట్లు చేయువానికి త్వరగా మరణము గలుగును.

(దీర్ఘకాలము జీవింపఁడు.)

శి;— ఇంతకుపై నింకను ఇచ్ఛ యుండినచో?

సో;- ఆ! అటులనా? అటులైన శవముపయి కప్పువస్త్రమును దెప్పించికొని యింటిలో హాజరుగా నుంచికొనవలెను. తరువాత నెట్లైనను జేయనీ!

పైనఁ జూపిన యీ శాస్త్రాదిప్రమాణములను బట్టి

స్త్రీసంసర్గము సర్వథా అనర్థకరమనియు, నయ్యది యెంత తక్కువగా నుండునో అంత తమేలు గలదనియు, మనుష్యుని యొక్క పారమార్థికమైన పురుషార్థత్వమునకు గూడ నిదియే సహకారియగుననియు స్పష్టపఱుప బడినది. ఈవిషయము స్త్రీలకును వర్తించును. కావున శ్రేయస్కాములగు పురుషులు గాని స్త్రీలుగాని యవశ్యము నీనియమములను బాటింపవలెను. కొందఱు స్వభావవిరుద్ధమైన కృత్రిమోపాయములతో సంతాననిరోధము సేయుచున్నారు. ఇట్లు చేయుట పాపము (అధిక) సంతానోత్పత్తి గాకుండు విషయమై నన్నింటికంటెను ధర్మయుక్తమైన చక్కని యుపాయము దంపతులు మనఃపూర్వకముగా బ్రహ్మచర్యమునకు సంబంధించిన ప్రతిజ్ఞ చేసికొనుటయే. బ్రహ్మచర్యానుష్ఠానముచే నిహపరలోకములు సిద్ధించును.

ఇక నిప్పుడు సంక్షేపముగా సూత్రరూపమున బ్రహ్మచర్యరక్షణను గూర్చి సాంఘికములు, వ్యక్తిగతములు నయి యున్న కొన్ని నియమముల నిట దెలుపుచున్నాము. ఇవి మననము సేయదగినవి. వీని ప్రయత్నపూర్వకముగా నాచరణలోనికి దీసికొని రావలెను.

## —। బ్రహ్మచర్య రక్షణోపాయములు. ।—

1. బాల్యవివాహము సర్వథా త్యజింపవలెను. కనీసము 25 సంవత్సరములకు లోపుగా బాలురకును, 16 సంవత్సరములకులోపుగా బాలికలకును వివాహము సేయరాదు.

2. వృద్ధవివాహముల నెంతమాత్రము జరుగనీయరాదు.

3. బ్రహ్మచర్యమునకు సంబంధించిన యాశ్రమముల స్థాపింప వలెను. వానిలో బాలురయొక్క బ్రహ్మచర్యరక్షణకయి మంచి కట్టుబాట్ల నేర్పఱచి ధర్మపద్ధతిని బాలురకు విద్య ను కూడ గఱపవలెను. కనీసము 25 సంవత్సరముల వయ స్సువఱకు బాలురు ఆశ్రమములో నవశ్యముండవలెను.

4. చాలా యువక యుండకనే-ముందుగా బాలబాలికల వివాహము చేయరాదు.

5. బాలబాలికలు రమణీయమైన దుస్తులను లేక ఆభరణ ములను ధరింపనీయరాదు.

6. శృంగారరసయుక్తములగు సంస్కృత, హిందీ లేక అన్య భాషా కావ్యములు, నాటకములు, నవలలు మున్నగు గ్రం థముల ప్రచారము నాటంకపఱపవలెను. బాలబాలికల చేతులలో నిట్టి పుస్తకముల నుంచరాదు. పాండిత్యము (లౌకికజ్ఞానము) గూడ నుండవలెననెడి దృష్టితో విద్యా ర్థులచే నిట్టి గ్రంథముల బఠింపించరాదు.

7. ఇట్టివే యగు నాటకములకు- సినీమాలకును బాలురను బోనీయరాదు. తామును బోరాదు.

8. ఉద్రేకమును గూర్చు పదార్థముల భుజింపరాదు. (ఎక్కువ) కారము, ఆవాలు, మసాలావస్తువులు, ఆవకాయమున్నగు నవి, (అతి) పులుపు (అతి) తీపిగల వస్తువులు మిగులవే-

పదార్థములు, ఇట్టివానిని భుజింపరాదు. అన్నమును బాగు గా నమలి తినవలెను. భోజనము ఎప్పుడును సాధారణ మైనదిగను, అప్పుడే తయారైనదిగను నుండవలెను. కాల నియమముగూడ [ఒక జాముపైన, రెండు జాములకు లోపు] ఉండవలెను. రాత్రి భోజనాన తరమే నిద్రపోరాదు.

9. నిత్యము ప్రాతఃకాలము, సాయంకాలము బహిరంగమైన గాలిలో కాలినడకతో సంచారము సేయవలెను

10. రాత్రి త్వరగా 9 లేక 10 గంటలకు పరుండి ప్రాతఃకాల మున బ్రహ్మముహూర్తమునందు 4 గంటలకు మేల్కొని యా పక్కపైననే యుండరాదు పరుండగా పూర్వము మూత్రవిసర్జన చేసియే పరుండవలెను. బుద్ధిమంతులగు స్త్రీపురుషులు పరస్పరము దగ్గరదగ్గరగా శయనింపరాదు రాత్రి భగవద్ధ్యానము సేయుచు అట్లే నిద్రపోవలెను. ప్రాతఃకాలమున మేల్కొనుటతోడనే మరల ధ్యానము సేయవలెను. పరుండి లేక అటనే కూర్చుండి ధ్యానము సేయరాదు.

11. దుస్సహవాసము సర్వథా పరిత్యజింపవలెను. స్త్రీసంబంధ మైన చర్చ యెన్నడును సేయరాదు. ఇట్లే స్త్రీయు అన్య పురుషచర్చ సేయరాదు.

12. దంపతులుగాక ఒంటరిగా మఱొకనితోనొక స్త్రీతోఁ బురు షుఁడుగాని, మఱొక పురుషునితో స్త్రీగాని సంభాషణ

సేయరాదు. ఇట్లే ఒంటరిగాఁ గూర్చుండరాదు.

13. స్త్రీలవైపెన్నఁడును దృష్టిని బోనీయరాదు. ఒకవేళ పోయిన మాతృ సోదరి భావన అథవా భగవద్భావన సేయవలెను. ఇట్లే స్త్రీలును పురుషులఁ జూచినప్పుడు పితృ-సోదర-భగవద్భావన సేయవలెను.

14. ఒంటరిగా నుండవలెను. లేదా, సజ్జనసహవాసము సేయవలెను. సద్గ్రంథములఁబఠింపవలెను. రామాయణ-భారత-భాగవతాది గ్రంథములలోని మంచి ఘట్టములఁ జదువుచుండవలెను. అర్థ సహితముగ తప్పక శ్రీమద్భగవద్గీతను నిత్యము పారాయణ సేయవలెను.

15. దర్జా-షోకు సర్వథా పరిత్యజింపవలెను. షోకు, శృంగారము వీనిచేత కామము మేలుకొంచునని గుర్తించుకొనవలెను. నేను ఇతరులకు మనోహరముగా గనపడవలెనని యే వాస్తవమునకు శృంగారము చేసికొందురు. ఇట్టివారు స్వయముగా భ్రష్టులయి యితరులనుగూడఁ బతితులఁ జేసివేయుదురు.

16. అత్తరు-సెంటు అంటించికొనరాదు. ఫేషన్‌గానుండరాదు కేశముల నలంకరింపరాదు. మాటిమాటికి అద్దముతో ముఖమును జూచికొనరాదు. పెదవుల నెఱ్ఱగా జూపుతలంపుతో తాంబూలమును వేసికొనరాదు. ఇది గృహస్థులకు బ్రహ్మచారులకు సర్వథా నిషిద్ధము. మద్యము-మర్బత్-

మున్నగువానిని సేవింపరాదు. ఉద్రేకమును గూర్చు సాధనముల వాడరాదు.

17. మలవిసర్జన లేక మూత్రవిసర్జన చేసిన పిదప గుహ్యావయవములఁ జన్నీటితో పరిశుభ్ర మొనర్చవలెను. మలమూత్రముల నిరోధింప (ఆప) రాదు.

18. సాధ్యమైనంతవఱకు పెద్దవారు సయితము నిత్యము చన్నీటితో స్నానము చేయవలెను.

19. నియమపూర్వకముగా వ్యాయామము సేయవలెను. యథాశక్తిగా నిత్యము కొన్ని యాసనములు వేయుట, ప్రాణాయామముఁ జేయుట మేలు.

20. లోపల లంగోటా లేక కౌపీనము నవశ్యము ధరింపవలెను

21. భగవద్విగ్రహములను నిత్యము ప్రేమ (భక్తి) పూర్వకముగా దర్శింపవలెను. నిజమైన సాధువులను,మహాత్ములను మనఃపూర్వకముగా సేవింపవలెను.

22. నిత్యము నియమముగా కొన్ని గంటలు పరమాత్ముని ధ్యానము సేయవలెను.

23. ఏ వ్యభిచారి లేక వ్యభిచారిణిని గుఱించిన చర్చ సేయరాదు. అట్టివిషయముల వినరాదు. అట్టివారియొద్ద నే కూర్చుండరాదు. ఏలయన నిదియే ప్రమాదకరము.

24. ఇతరు లనుకొనుటకుగాక ఏకతెగకుండ భగవన్నామమును జపించుచుండవలెను. శ్వాసతోగూడ మిళితముఁ జేసి

చేయుట మిగుల మంచిది. కామము జాగృతమైనప్పుడు రామాయణమును బఠింపవలెను. లేక నామజపమును తీవ్రముగా జేయవలెను. గట్టిగా భగవన్నామసంకీర్తనను జేయవలెను. నామజప, నామసంకీర్తనముల యెదుట కాము మన్మథుడును నిలువజాలడు. దీనికి ఇయ్యదియనుభవపూర్వకమైన సిద్ధప్రయోగము.

25. జగత్తునందు వైరాగ్యభావన గలిగియుండవలెను జగత్తు ప్రతిక్షణము నశించుచునేయున్నదని స్మరించుచుండవలెను

26 స్త్రీయొక్క రూపము-సౌందర్యముపై పురుషుడును, పురుషునియొక్క రూపము-సౌందర్యముపై స్త్రీయు దోషమును గ్రహించుట నేర్చుకొనవలెను. చర్మముచే గప్పబడిన యీ శరీరమునందు రక్తము, మాంసము, మలమూత్రములు, ఎముకలు ఇవి యన్నియు నసహ్యములే యని మాటిమాటికి స్మరించుచు పరస్పరసౌందర్యమును మఱచిపోవలెను.

27. మాసమునకు రెండు లేక కనీసము ఒక్క ఉపవాసమైనను జేయవలెను. ఉపవాసమును ఫలాహారముచే జేయరాదు.

28. మహాత్ముల, వీరుల, బ్రహ్మచారుల చరిత్రల స్మరించుచుండవలెను.

29. సమస్త భూతములయందును భగవద్భావన సేయవలెను.

30. మనయొక్క చివరిలక్ష్యము "బ్రహ్మప్రాప్తి" యని మఱు వకుము.

హరిః ఓం తత్ సత్.




జానకీముద్రాక్షరశాల ప్రొద్దుటూరు సి. ఐ. సి. 18 నం. 1000, 31-1-31

# ఈ గ్రంథకర్త యొక్క రచనలలో

## ముద్రిత గ్రంథములు



1. శ్రీవిష్ణు సహస్ర నామ (శంకర భాష్యాను వాదము)
2. ప్రశ్నోత్తరి (తాత్పర్య సహితము)
3. నారద భక్తిసూత్రములు (తాత్పర్య సహితము)
4. ముక్తిగీత (తాత్పర్య సహితము)
5. స్వస్వరూప దర్పణము (తాత్పర్య సహితము)
6. బ్రహ్మచర్యము (ఇది మా హస్తగతము)

## అముద్రితములు.

1. గీత-శంకర భాష్యాను వాదము
2. గీత-శంకరానంద వ్యాఖ్యాను వాదము
3. శ్రీగోవింద దామోదర స్తోత్రము
4. అద్వైత-ఆర్యా పంచకము

స్వామి శుద్ధచైతన్య,
కైలాసాశ్రమము,
కాళహస్తి

